# ఫతేసింగ్, జొరావర్ సింగ్


రచన

**హర్బజన్‌సింగ్ హంసపాల్**

అనువాదం

**హైందవి**

ప్రధాన సంపాదకులు

**ఎల్.ఎస్. శేషగిరిరావు**



**భారత భారతి పుస్తకమాల**

(తెలుగు సంస్కరణ)

3-4-852, బర్కత్‌పురా, హైదరాబాద్-27.

# ఇది మా మాట

కేవలం భారతదేశంలోనే కాక, మొత్తం ప్రపంచంలోనే ప్రఖ్యాతులైన మన పూర్వీకులను స్మరించడం, వారి జీవితాలను అధ్యయనం చేయడం ఎల్లప్పుడూ ప్రేరణదాయకంగాను, మార్గదర్శకంగాను ఉండగలదనడంలో సందేహం లేదు.

మన చరిత్రకే వన్నెతెచ్చిన ఆ మహనీయుల జీవితాలను సరళమైన, ఉత్తేజకరమైన భాషలో ప్రజలకందించే చక్కని ప్రయత్నాన్ని రాష్ట్రోత్థాన పరిషత్, బెంగుళూరువారు ప్రారంభించారు.

"నవయుగభారతి" ఆ పుస్తకాలను తెలుగులోకి అనువదించే బృహత్కార్యాన్ని చేపట్టింది. భారత భారతి పుస్తకమాల రూపంలో మీ చేతుల్లో ఉన్న పుస్తకాలు ఆ ప్రయత్న ఫలితమే. మన చరిత్రలోని మహాపురుషుల జీవితాలు ఈ పుస్తక మాల ద్వారా మీకందించబడతాయి.

అమరమైన, అనంతమైన మన గత చరిత్ర అనే అమృత స్రోతస్సును తరువాతి తరానికి అందించగలుగుతున్నామనే సంతృప్తితో ఈ పుస్తకాలను మీముందు పెడుతున్నాం. మీరు కూడా ఈ కృషిని ప్రశంసించగలరని, ప్రోత్సహించగలరని ఆశిస్తాను.

మూలరచనను సరళమైన, ఆహ్లాదకరమైన రీతిలో తెలుగులోకి అనువ దించిన అనువాదకులకు ధన్యవాదములు.

– హరిహరశర్మ

సంపాదకులు

ప్రచురణ కర్తలు

**నవయుగభారతి ప్రచురణలు**

పోస్ట్‌బాక్స్ నెం. 1041

నారాయణగూడా, హైదరాబాద్ - 500 029.

*తెలుగు సంస్కరణ సంపాదకులు*

**టి. హరిహర శర్మ**

*ప్రథమ ముద్రణ : నవంబర్, 2002*

**వెల: రూ. 8.00**

ప్రతులకు

**సాహిత్యనికేతన్**

3-4-852, బర్కత్‌పురా

హైదరాబాద్ - 500 027

ఫోన్ : 2756 3236

**సాహిత్యనికేతన్**

ఏలూరు రోడ్

విజయవాడ - 520 002

ఫోన్ : 2667421

**భా**రతీయ చరిత్రలో గురు తేగ్ బహదూర్ బలిదానం అత్యంత ప్రాముఖ్యతగల సంఘటన. ఆయనసిక్కుల తొమ్మి దవ గురువు. ఆ సమయంలో భారతదేశంలో మొగలుల సామ్రాజ్యం ఉండేది. ఔరంగజేబు ఒక నిష్ఠగల ముస్లిం. ముస్లింలుగా మారమని హిందువులను అనేక కష్టాలకు గురిచేసేవాడు. మొత్తం భారతదేశాన్ని ఇస్లాం అనుయాయు లుగా మార్చాలని కోరుకునేవాడు. ఆ సమ యంలో ధార్మిక రంగంలో హిందువులందరికీ బ్రాహ్మణులు నాయకత్వం వహించేవారు. ఆయన బ్రాహ్మణులను అణచి వేయడం ప్రారంభించాడు. పెద్దసంఖ్యలో బ్రాహ్మణులను ఇస్లాం మతం స్వీకరించేట్లు చేయగలిగితే ఇతర వర్గాలకు చెందిన వారిని సులభంగా మతం మారేట్లు చేయవచ్చని ఔరంగజేబు అభిప్రాయం. ఢిల్లీ ప్రభుత్వాన్ని మెప్పించడం కోసం, ఇతర ప్రాంతాల్లోని నవాబులు కూడా హిందువులను బలవంతంగా మతం మార్చడం ప్రారంభించారు.

# ఫతేసింగ్ - జొరావర్‌సింగ్

ఫతేసింగ్, జొరావర్‌సింగ్‌లిద్దరూ
బాలురు. ఒకరు ఐదు సంవత్సరాల
వయసుగలవారైతే, మరొకరు ఏడు
సంవత్సరాల వయస్సుగలవారు.
అయినా తమ ధర్మంకోసం,
దాన్ని రక్షించడం కోసం,
తమ ప్రాణాలను
బలిదానం చేయడంలో పోటీ పడ్డారు.
నవ్వుతూ నవ్వుతూ తమ చుట్టూ పేర్చిన
గోడలో తమ ప్రాణాలను సమర్పించిన
వీర గురుపుత్రుల అమర చరిత్ర ఇది.

ఆటలాడటానికి బయటకు వెళ్ళి తిరిగి వచ్చాడు. బాల గోవిందుడు తన తండ్రి దిగులుగా ఉండటం చూసి కారణ మడిగాడు. గురువు విషయాన్ని చెప్పి, చివరిలో 'ఎవరో ఒక మహాపురుషుడి బలిదానం (ప్రాణత్యాగం) ద్వారానే వీరి కష్టాలు దూరమవుతాయి' అన్నాడు. అది విన్న బాల గోవిందుడు వెంటనే తండ్రీ! మీకంటే మించిన మహాపురుషుడు ఇంకెవరున్నారు? అన్నాడు. గురుతేగ్ బహదూర్‌కు సమా ధానం లభించింది. బాలగోవిందుని ధైర్య వాక్కులకు సంతోష పడ్డాడు. ఆ సమయానికి బాలగోవిందుడి వయస్సు కేవలం తొమ్మిది సంవత్సరాలు. గురువు కాశ్మీరీ పండితులతో ఇలా అన్నాడు : గురు తేగ్ బహదూర్ గనుక ఇస్లాంను స్వీకరిస్తే మేము కూడా ఇస్లాం మతాన్ని స్వీకరిస్తాం అని తెలియ జేయండి.

## గురు తేగ్ బహదూర్ బలిదానం

గురువు సమాధానం విన్న ఔరంగజేబు కోపంతో ఎగిరెగిరి పడ్డాడు. గురువును ఢిల్లీ దర్బారులో హాజరు

అనేక స్థలాల్లో దేవాలయాలను పడగొట్టి మసీదులు కట్టించేవారు. హిందువులపై జిజియా పన్ను విధించేవారు. ఏ హిందువు కూడా ఆయుధాలు ధరించరాదు. హిందువులు గుఱ్ఱపు స్వారీ చేయడాన్ని నిషేధించారు. భారతీయ సంస్కృతి, ధర్మాలను నాశనం చేయాలని మొగల్ పాలన నిర్ణయించుకుంది.

## బాలగోవిందుడి సాహసం

అప్పటి కాశ్మీర్ నవాబు కూడా బ్రాహ్మణులను బల వంతంగా మతం మార్చేవాడు. కాశ్మీరీ బ్రాహ్మణులు భయ భ్రాంతులై ఒకచోట సమావేశమయ్యారు. ధర్మరక్షణ కోసం, ఆనందపూర్‌లో ఉన్న గురుతేగ్ బహదూర్ వద్దకు వెళ్ళాలని నిర్ణయించుకున్నారు. పండిత కృపారామ్ నాయకత్వంలో ఐదువందలమంది బ్రాహ్మణులు ఒక జట్టుగా ఏర్పడి ఆనందపూర్ చేరుకున్నారు. తమ బాధను వాళ్ళంతా గురువుకు విన్పించారు. వాళ్ళ బాధల్ని విన్న గురువు దిగులు పడ్డాడు. ప్రజలందరూ ఆ విషయమే ఆలోచించసాగారు. వాతావరణం వేడెక్కింది. అదే సమయంలో గురుపుత్రుడైన గోవిందుడు

కొండ జాతుల రాజులతో అనేక యుద్ధాలు చేశాడు. వాటిలో ఎక్కువ యుద్ధాల్లో విజయం పొందాడుకూడా. గురుగోవింద్ సింగ్ ఒక మహావీరుడు. అంతేకాదు, ఆయనొక కవి కూడా. ఆయన కత్తితోనే కాదు కలంతో కూడా తన ప్రావీణ్యాన్ని చూపించాడు.

గురుగోవింద్ సింగ్‌కు నలుగురు పుత్రులు. వాళ్ళ పేర్లు అజిత్‌సింగ్, జుఝార్‌సింగ్, జొరావర్ సింగ్, ఫతేసింగ్.

## ఔరంగజేబుద్వారా విశ్వాస ఘాతుకం

ఒకసారి గురుగోవింద్‌సింగ్ ఆనందపూర్‌లో ఉన్నాడు. కొండ రాజుల సహాయంతో మొగలులు కోటకు నాలుగు వైపులా దిగ్బంధనం చేశారు. ఎన్ని ప్రయత్నాలు చేసినా మొగలులు విజయం సాధించలేకపోయారు. హతాశుడైన ఔరంగజేబు గురువుకు ఒక సందేశాన్ని పంపాడు.. గురుగోవింద సింగ్ గనుక ఆనందపూర్ కోటను వదిలి వెళ్ళేట్లయితే అతనితో యుద్ధం చేయమని ఔరంగజేబు ఖురాన్‌పై ఒట్టువేసాడు. ఔరంగజేబు ప్రతిజ్ఞపై గురువుకు

కమ్మని ఆదేశించాడు. గురువు ఢిల్లీకి బయలుదేరాడు. అయితే ఆగ్రాలోనే ఆయనను బంధించారు.

ఇస్లాంను స్వీకరించడం లేదా ఏదైనా అద్భుతాన్ని చూపడమో చేయాలని గురువుతో అన్నారు. గురువు ఆ రెండింటినీ కాదన్నారు. చివరికి గురు తేగ్ బహదూర్‌ను ఢిల్లీలోని చాందినీ చౌక్‌లో వధించారు.

తన బలిదానం వ్యర్థం కాదని గురువుకు తెలుసు. గురు తేగ్ బహదూర్ తన జీవితాన్ని బలిదానం చేసి దేశాన్ని, ధర్మాన్ని రక్షించాడు. ఈ కారణంగా గురు తేగ్ బహదూర్ 'హింద్‌కీ చాదర్' (హిందూ ధర్మ పరిరక్షకుడు) అని పిలవ బడ్డాడు.

## గురుగోవింద్ సింగ్

తండ్రి బలిదానం చేసిన తర్వాత బాలుడైన గోవింద్ సింగ్ సిక్కులకు గురువయ్యాడు. గోవింద్ సింగ్ కేవలం తొమ్మిదేళ్ళ వయస్సులోనే తండ్రిని బలిదానం చేయడానికి ప్రేరణనిచ్చాడు. భవిష్యత్తులో ఈ వీరబాలుడే మొగలులతో

రైతుకు చెందిన ఎత్తైన భవనాన్ని కోటగా మార్చారు. మొదట ఆరుగురు సైనికులను యుద్ధానికి పంపించారు గురువు. అనేకమంది మొగల్ సైనికులను చంపి వాళ్ళు వీరగతిని పొందారు. తరువాత గురువు మరో నలుగురిని పంపించారు. వాళ్ళుకూడా వీరోచితంగా పోరాడి వీరగతిని పొందారు. చివరకు స్వయంగా గురువే యుద్ధరంగానికి వచ్చాడు. మొగల్ సేనాపతులైన సహర్‌ఖాన్, గౌరత ఖాన్‌లు గురువు బాణపుదెబ్బలకు చనిపోయారు. మొగల్‌సైనికులు ఓటమిని అంగీకరించేవాళ్ళుకాదు. వాళ్ళు కొండ రాజుల సహాయంతో మళ్ళీ యుద్ధం ప్రారంభించారు. రెండవ రోజు గురువు పెద్దకొడుకు అయిన అజిత్‌సింగ్, ఐదుగురు సిక్కు సైనికులను తీసుకుని యుద్ధరంగానికి వెళ్ళాడు. అప్పటికి అతని వయసు కేవలం 18 సంవత్సరాలు. యుద్ధంలో అనేకమంది మొగల్ సైనికులను చంపుతూ వీరమరణం పొందాడు. తర్వాత రెండవ పుత్రుడైన జుఝార్‌సింగ్ తండ్రి ఆజ్ఞతో అయిదు మంది సైనికులతో రణరంగానికెళ్ళాడు. చివరి శ్వాస వరకూ శత్రువులతో పోరాడి జుఝార్‌సింగ్ మరణించాడు.

నమ్మకంలేదు. అయితే సిక్కుల సలహాప్రకారం కోటను ఖాళీ చేశాడు. ఈ ఉపాయం ద్వారా గురువు కోట వదిలి రావాలనే మొగల్ సైన్యం ఆలోచన. ఆవిధంగా వాళ్ళు కోరుకున్నది జరిగింది. గురువు కొంతమంది సిక్కుసైనికులతో కలసి బయటకి వచ్చాడు. బయటికి రాగానే వాళ్ళపై మొగల్ సైన్యం విరుచుకుపడింది. సరసానది ఒడ్డున భయంకర యుద్ధం జరిగింది. సిక్కు సైనికులు తక్కువమంది ఉన్నారు. అయినా మొగల్ సైనికులను ఎదుర్కొని వేలాదిమందిని నరికివేశారు. యుద్ధం సాగిస్తూనే గురువు చమకౌర్ వైపుకు బయలుదేరాడు. ఆ సమయంలో గురుపుత్రుల్లో పెద్దవారైన అజిత్‌సింగ్, జఝూర్ సింగ్‌లు ఆయన వెంట ఉన్నారు.

## పుత్రులకు వీరగతి ప్రాప్తించింది

సరసానది దాటి మజర్‌పూర్ గ్రామం చేరుకున్నాడు గురువు. అదేసమయంలో ఔరంగజేబు సైన్యం వస్తోందనే సమాచారం వచ్చింది. గురువు చమకౌర్ చేరుకున్నారు. అక్కడి ఒక తోటలో గుడారం వేసుకున్నారు. ఒక జాట్



నాన్నమ్మ గుజారీమాతతో కలసి అడవులలో నడిచివెళ్తున్న
జొరావర్‌సింగ్ ఫతేసింగ్

## విడిపోయిన కుటుంబం

ఆనందపూర్‌ను వదిలిపెట్టే సమయంలోనే గురుగోవింద సింగ్ కుటుంబం విడిపోయింది. అతని చిన్నపిల్లలు జోరావర్ సింగ్, ఫతేసింగ్ వారి నాన్నమ్మ గుజరీ ఆనందపూర్ వదిలి వెళ్ళిపోయారు. అడవులు, కొండలు దాటి ఒక పట్టణం చేరుకున్నారు. అక్కడ వారు కమ్మో అనే పేరుగల వ్యక్తిని కలుసుకున్నారు. నీటిని తోడిపోసే పేద కార్మికుడు కమ్మో. అతడు మాతా గుజరీని, ఆమె చిన్నపిల్లలను గుర్తించి తన ఇంటిలో ఉండమని ప్రార్థించాడు. చాలా ప్రేమతో వారికి సేవచేశాడు.

## గంగూ బ్రాహ్మణుడు

ఆవీధిలోకి గంగూ అనే పేరుగల బ్రాహ్మణుడు ఏదో పనిమీద వచ్చాడు. అతడు గురుగోవింద్ సింగ్ వద్ద ఇరవై రెండేళ్ళనుండి వంటపని చేసేవాడు. గురుపుత్రులు వచ్చిన విషయం తెలిసి చాలా సంతోషపడ్డాడు. అతడు మాతా గుజరీ వద్దకొచ్చి తన గ్రామానికి రావలసిందిగా ప్రార్థించాడు.

ఇద్దరు పిల్లలూ నడవసాగారు. దారిలో వాళ్ళకు మహావీరుల కథలు వినిపించసాగింది గుజరీమాత. దీర్ఘమైన పాదయాత్ర తర్వాత వాళ్ళు గంగూ ఇంటికి చేరుకున్నారు. అలసట కారణంగా భోజనం సంగతి కూడా మరచిపోయి వెంటనే నిద్రపోయారు. పిల్లలిద్దరూ వాళ్ళ నాన్నమ్మకు చెరోవైపు పడుకున్నారు. వాళ్ళ రక్షణ గురించి ఆలోచించడంతో గుజరీమాతకు నిద్రపట్టలేదు.

## కృతఘ్నుడైన గంగూ

గంగూ పండితుడు గుజరీమాత వద్దనున్న బంగారు నాణాలు, ఇతర విలువైన సామగ్రి చూసి స్వార్థపరుడైనాడు. ఆరాత్రికే నాణాలను, విలువైన వస్తువులనూ దొంగిలించాలని ఆలోచించాడు. మెల్లగా తలుపుతెరుచుకుని పిల్లలున్న గదిలోకి ప్రవేశించాడు. బంగారు నాణాలను, విలువైన ఇతర వస్తువులనూ బయటకు తీశాడు. గుజరీమాత అన్నీ చూస్తూ కూడా మౌనంగా ఉండిపోయింది. గంగూ పండితుడు సామాన్లు తీసుకుని తలుపులు మూసి వెళ్ళిపోయాడు.

గుజరీమాత సందిగ్ధంలో పడింది. ఆమె మనస్సులో అనేక ఆలోచనలు కలుగుతున్నాయి. ఒకవేళ గంగువిశ్వాసఘాతకం చేస్తే చిన్నపిల్లల ప్రాణాలేమవుతాయి? ఎక్కువగా ఆలోచిస్తూ పోవడంతో ఆమె మనస్సంతా బాధతో నిండి పోయింది. ఆమె చూడ్డానికి సంతోషంగా ఉన్నట్లు కన్పించినా పిల్లల విషయంలో దిగులుపడుతూ ఉండేది. ఆమె వీరుడైన గురుగోవింద్ సింగ్ తల్లి. గుజరీమాత దిగులును చూసి గంగూ ఇలా అన్నాడు:

అమ్మా! నేను మీకు చాలా పాత పనిమనిషిని. అనేక సంవత్సరాలపాటు మీ ఉప్పుతిన్నాను. ఇలాంటి కష్టసమయంలో మీ సేవ చేసుకునే అవకాశమివ్వండి. మీగురించి పిల్లలగురించి ఎలాంటి విషయమూ బయటికి పొక్కదు.

గంగూ ఇచ్చిన వాగ్దానంతో గుజరీమాత పిల్లలతో సహా అతడి గ్రామానికి వెళ్ళడానికి సమ్మతించింది. సామానంతా గాడిదపై వేసుకుని, గంగూ తన గ్రామం వైపుకు నడవ సాగాడు. వెనుకనే గుజరీమాత చిటికెన వేళ్ళు పట్టుకొని

## నవాబుకు వార్త

ఆ మాటలన్న గంగూ ఇంట్లోనుండి బయటకెళ్ళాడు. అతని మనసులో మరొక దుష్ట ఆలోచన కల్గింది. గురు పుత్రులు నా ఇంట్లో ఉన్న విషయాన్ని నవాబుకు తెలియజేస్తే మంచి బహుమానం లభిస్తుంది అన్నదే ఆ దుష్ట ఆలోచన. బహుమానం పట్ల మోజుతో చకచకా నడవడం మొదలు పెట్టాడు. కొత్వాలు కార్యాలయానికి (న్యాయాధికారి కార్యాలయానికి) వెళ్ళాడు. అయ్యా! మీకొక సంతోషం కలిగించే వార్త చెప్పదలచుకున్నాను అన్నాడు. చెప్పండి ఏమిటా వార్త? న్యాయాధికారి ఆతృతగా అడగటంతో గంగూచెప్పడం మొదలుపెట్టాడు. అయ్యా! గురుగోవింద్ సింగ్ మొగల్ చక్రవర్తికి శత్రువు అనే సంగతి మీకు తెలుసు. ఔరంగజేబుకు వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొడుతున్నాడు. ఆ గురుగోవింద్ సింగ్ తల్లి, అతడి ఇద్దరు చిన్న పిల్లలు నిన్న రాత్రి నా ఇంటిలోకి చొరబడ్డారు. నేను మొగల్ పాలనకు కట్టుబడిన పౌరుడిని, మీకు ఈ విషయం తెలియజేయడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను.

ఉదయాన్నే గంగూ పండితుడు గదిలోకివచ్చాడు. గుజరీ మాత నాణాలు దొంగిలించబడిన సంగతి చెప్పింది. తడ బడ్తున్న గొంతుతో రాత్రి దొంగలేమైనా వచ్చారా? అనడిగాడు. బయట తలుపు వేసే ఉంటే దొంగలు లోపలికెలా వస్తారు? అన్నది గుజరీ మాత. గంగూ ఇంట్లోనుండి బయటకు వచ్చి దొంగ, దొంగ అని అరవసాగాడు. అతడిని లోపలికి పిలిచి, ఇలా అరిస్తే మేము ఇక్కడున్న సంగతి అందరికీ తెలిసి పోతుంది. నీకు కావలసిన వస్తువులను నన్ను అడుగవచ్చు. ఇప్పుడు కూడా నీనుండి వస్తువులను తిరిగివ్వ మని నేనడగను. సామాన్లన్నింటినీ నీదగ్గరనే ఉంచుకో కానీ గట్టిగా మాత్రం అరవకు. అన్నది గుజరీమాత.

గుజరీమాత మాట విన్న గంగూ కోపోద్రిక్తుడయ్యాడు. ఓ ముసల్దానా! నేనునీకు నా ఇంట్లో శరణు ఇచ్చాను. దానికి బదులుగా నువ్వు నన్ను దొంగను చేస్తున్నావు. ఉండు నీకొక తమాషా చూపిస్తాను అన్నాడు.



స్లాంగాని, మాధర్మాన్ని విడిచిపెట్టమని నినదిస్తున్న బాలవీరులు.



నిర్భయంగా నవాబుకు ఎదురు నిలిచి ప్రాణాలనయినా యిస్తాంగాని,

వైపు తదేకంగా చూడసాగారు. గంగూ తల వంచుకుని మాటలన్నీ వినసాగాడు.

కొత్వాల్ కార్యాలయానికి చేరుకోగానే గుజరీమాతను, పిల్లలనూ ఖైదులో పెట్టారు. పిల్లల్లో ధైర్యాన్ని కలిగించేందుకు గుజరీమాత సిక్కు గురువుల త్యాగం బలిదానం కథలు చెప్పింది. పిల్లలు కూడా తన్మయత్వంతో తమ నాన్నమ్మ చెప్పే తమ పూర్వీకుల వీరగాథలు విన్నారు.

## సర్ హింద్‌కు ప్రయాణం

మరుసటి రోజు గుజరీమాతను, పిల్లలను ఎద్దులబండి లోకి ఎక్కించి, మొగల్ సైనికులు సర్ హింద్‌కు బయలు దేరారు. నాయనమ్మతో కలసి పిల్లలిద్దరూ ముందుకు సాగుతున్నారు. వాళ్ళను చూడడానికి దారికి రెండువైపులా ప్రజలు నిలబడ్డారు. మొగల్ సైనికులు త్వరత్వరగా ముందుకువెళ్ళిపోయారు. సర్‌హింద్‌కు చేరిన పిదప గుజరీ మాతకు, పిల్లలకు ఆహారం కూడా పెట్టకుండా, డిశంబర్ నెల చలిలో, ఒక బురుజులో ఉంచారు. పిల్లలు తమ నాయనమ్మతో కలసిదేవుని భజన చేయడం మొదలుపెట్టారు.

## బంధీలైన గుజరీమాత, గురుపుత్రులు

గంగూ పండితుడు చెప్పిన మాటలు విన్న కొత్వాలు ఆనంద పడ్డాడు. గంగూ వెంట కొంతమంది సైనికులనిచ్చి పంపాడు. గుజరీమాత, గురుపుత్రులను పట్టుకురమ్మని ఆజ్ఞాపించాడు. గంగూ పండితుడు సంతోషపడుతూ సైనికులకు ముందు భాగంలో నడవసాగాడు. గుజరీమాత, ఇద్దరు చిన్నపిల్లలు నిశ్చింతగా కూర్చొని ఉన్నారు. గంగూ వెంట సైనికులు రావడంచూసి గుజరీమాతకు విషయం అర్థమయింది. సైనికులు కొత్వాల్ ఆజ్ఞను గుజరీమాతకు వినిపించి తమవెంట రావలసిందిగా కోరారు.

పిల్లలిద్దరూ వెంటనే లేచి నిలబడ్డారు. గుజరీమాతతో పాటు నిర్భయంగా నడవసాగారు. గుజరీమాతను, చిన్న పిల్లలను చూసి నగర ప్రజలంతా గుసగుసలాడుకుంటున్నారు. పిల్లల సుకుమారం, సాహసం చూసిన ప్రజలంతా వారిని పొగడ సాగారు. గంగూ ముందు నడుస్తున్నాడు. అనేకమంది స్త్రీలు ఇళ్ళలో నుండి బయటకు వచ్చి గంగూను తిట్ట సాగారు. కొందరైతే అతడిని రాక్షసుడంటున్నారు. గుజరీమాత ఆ పిల్లల ముఖాల్లోని తేజస్సును చూసి నగర ప్రజలు వాళ్ళ

న్నారు. బాలల శరీరంపై కాషాయ వస్త్రాలు, తలపాగా, ఖడ్గం ఉన్నాయి. వారి సుందరదేహం, పాలుగారే బుగ్గలు చూసిన నవాబు వజీర్ ఖాన్ మనస్సులో వారిపట్ల దయ కలిగింది. బాలలకు నచ్చచెబుతున్నట్లు ఇలా అన్నాడు :

పిల్లల్లారా! మీరు చాలా అందంగా ఉన్నారు. నేను మిమ్మల్ని నవాబుల పిల్లల్లాగా ఉండాలనుకుంటున్నాను. అందుకుగానూ మీ ధర్మాన్ని వదలిపెట్టి ఇస్లాం ధర్మాన్ని స్వీకరించాల్సుంటుంది. అలా చేస్తే మీకు మంచి బహుమానం కూడా లభిస్తుంది. మీకు నా షరతు నచ్చిందా? చెప్పండి.

పిల్లలిద్దరూ ఒకమారుగా 'మాకు మా ధర్మం ప్రాణాల కంటే ప్రియమైనది. మా చివరి శ్వాస వరకూ దాన్ని వదిలిపెట్టము' అన్నారు.

## పిల్లలు నిర్దోషులు

పిల్లలకు శిక్ష విధించడానికిముందు నవాబు ఖాజీ (మంత్రి)ని సలహా అడిగాడు. ఈ పిల్లలు నిర్దోషులు. ఇస్లాం మతం ప్రకారం వీళ్ళకు శిక్ష విధించరాదు అన్నాడు ఖాజీ.

## నాన్నమ్మకు వాగ్దానం

రాత్రంతా పిల్లలకు వీరగాథలు చెప్పి ప్రేరితులను చేస్తున్నది గుజరీమాత. క్లిష్టమైన పరిస్థితులలో ఆ చిన్నపిల్లలు తమ ధర్మం నుండి ఎక్కడ దూరమౌతారోననేది ఆమె భయం. తమ తండ్రిపేరును నిలబెడతామని ఎట్టి పరిస్థితుల్లోనూ తమ ధర్మాన్ని వదిలిపెట్టమని ఆ పిల్లలిద్దరూ తమ నాయనమ్మకు మాట ఇచ్చారు. తెల్లవారగానే పిల్లలను తీసుకెళ్ళడానికి సైనికులు వచ్చారు. నిర్భయులైన పిల్లలు వెంటనే లేచి నిలబడ్డారు. పిల్లలిద్దరూ తమ నాయనమ్మ పాదాలకు నమస్కరించారు. నాన్నమ్మ విజయం కలుగుగాక అని ఆశీర్వదించింది. గర్వంగా తలెత్తుకుని సైనికులవెంట నడవసాగారు. నవాబు వజీర్ ఖాన్ దర్బారులోకి ప్రవేశించాడు. పిల్లలిద్దరు గట్టిగా క్రింది విధంగా నినాదమిచ్చారు.

వహి గురూజీకా ఖాల్సా
వహి గురూజీ కీ ఫతహ్!

## ధర్మాన్ని వదిలిపెట్టమని సలహా

దర్బారులో ఉన్న ప్రజలంతా ఆ వీరబాలలవైపు చూస్తు

అదే సమయంలో మంత్రి సచ్చానందుడు లేచి పిల్లలను ఇలా అడిగాడు : 'పిల్లలూ మిమ్మల్ని వదిలిపెడితే మీరు ఏం చేస్తారు?' బాలుడైన జొరావర్‌సింగ్ అన్నాడు 'మేం సైనికులను సమకూర్చుకుంటాం, మీరు చేస్తున్న అత్యాచారాలను ఆపడానికి యుద్ధం చేస్తాం.' ఒకవేళ మీరు ఓడిపోతే? మంత్రి అడిగాడు. 'ఓటమి అనేది మా జీవితంలో లేదు. ఈ అత్యాచార ప్రభుత్వం అంతమయ్యే వరకూ లేదా మేం యుద్ధంలో చనిపోయేంతవరకూ మాసైన్యంతో కలిసి యుద్ధం చేస్తూనే ఉంటాం' అని జొరావర్‌సింగ్ దృఢంగా జవాబిచ్చాడు. పిల్లల మనోధైర్యం పోగొట్టడానికి ఇలా అన్నాడు : పిల్లలూ మీకు తెలుసా? మీ తండ్రి, మీ అన్న యుద్ధంలో చనిపోయారు. ఇక మీకు ప్రపంచంలో ఎవరూ లేరు. కాబట్టి నవాబు చెప్పినట్లు వినండి. ఇస్లాం మతం స్వీకరించండి.

పిల్లలు మరింత గట్టిగా మాతండ్రి ఒక మహావీరుడు. ఆయనను ఎవరూ చంపలేరు. పిల్లలపట్ల నవాబుకు మరింత కోపం కలుగుతోందని మంత్రి సచ్చానందుడు గ్రహించాడు.

'వీళ్ళ తండ్రి తప్పుచేసాడు' నవాబు అన్నాడు. అయినాసరే ఇస్లాం ప్రకారం తండ్రికి విధించాల్సిన శిక్ష పిల్లలకు విధించ రాదు. ఖాజీ స్పష్టంచేశాడు.

వీళ్ళు దర్బారును అవమానించారు నవాబు చెప్పాడు. అయినా వీళ్ళు పిల్లలు కాబట్టి నిర్దోషులు అన్నాడు ఖాజీ. పిల్లలను మరొకసారి బుజ్జగించడానికి ప్రయత్నించాడు నవాబు. పిల్లలూ ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు. మీ జీవితాలను నాశనం చేసుకోవద్దు. ఇస్లాంను అంగీకరించండి. మిగతా జీవితాన్ని అనుభవించండి అన్నాడు.

## ధర్మం ప్రాణాలకంటే ప్రియమైనది

పిల్లలు నిర్భయంగా పెద్దగొంతుతో 'మేం గురుగోవింద్ సింగ్ పుత్రులం. మాతాత గురు తేగ్ బహాదూర్ ధర్మాన్ని రక్షించడానికి బలిదానం చేసారు. మేము వారి సంతానం. మేము మా ధర్మాన్ని ఎప్పటికీ వదులుకోము. మాకు ధర్మం ప్రాణాలకంటే ప్రియమైనది.'

ఒక యుద్ధంలో మలేర్‌కోట్లా నవాబు షేర్ మహమ్మద్‌ఖాన్ తమ్ముడు గురుగోవింద్ సింగ్‌తో పోరాడుతూ చనిపోయాడు. సర్ హింద్ నవాబు పిల్లలకు విధించిన శిక్షను అమలు చేయడానికి అతనికి బాధ్యత అప్పగించాలనుకున్నాడు. పిల్లలను సజీవ సమాధి చేయడం ద్వారా తన తమ్ముడి చావుకు బదులు తీర్చుకోగగలుగుతాడని భావించాడు. మలేర్‌కోట్లా నవాబు షేర్ మహమ్మద్‌ను పిలిపించాడు. సిక్కులు నీ తమ్ముడిని చంపారు. ప్రస్తుతం గురుగోవిందసింగ్ పిల్లలిద్దరూ నా అధీనంలో ఉన్నారు. వారిద్దరినీ సజీవ సమాధి చేయాలని న్యాయాధికారి తీర్పునిచ్చారు. వాళ్ళను నీకు అప్పగిస్తాను. నీ తమ్ముడిని చంపినందుకు ప్రతీకారంగా వాళ్ళను సజీవ సమాధి చేయి అన్నాడు సర్‌హింద్ నవాబు.

మలేర్‌కోట్లా నవాబు ధార్మిక భావాలు గల వ్యక్తి. సర్‌హింద్ నవాబు నిర్ణయాన్ని విని ఆశ్చర్యపోయాడు. నాకు ఎలాంటి అన్యాయమూ జరగలేదు. నా తమ్ముడు యుద్ధంలో చనిపోయాడు. ఆ సంఘటనలో ఈ పిల్లల బాధ్యత ఏముంది? అన్నాడు.

నవాబును ఉత్తేజపరుస్తూ అంతా విన్నారుకదా! ఈ పిల్లలు మీ అధికారానికి వ్యతిరేకంగా యుద్ధం చేయాలని భావి స్తున్నారు. పెద్దయిన తర్వాత తమ తండ్రితోపాటు పాదుషా సామ్రాజ్యాన్ని అంతంచేయడానికి ప్రయత్నిస్తారు. అలాంటి వీరిపై దయ చూపడం సరికాదు అన్నాడు.

మంత్రి సచ్చానందుడు, నవాబుల మధ్య జరుగుతున్న సంభాషణ వింటూ నిర్భయంగా ఉండటమే కాక మధ్య మధ్యలో నవ్వుకుంటున్నారు పిల్లలు. మంత్రి మరొక మారు న్యాయాధి కారి (ఖాజి)కి భవిష్యత్తులో ఈ పిల్లలు విద్రోహు లుగా మారతారనే విషయం వివరించారు. అతడు కూడా పిల్లలిచ్చిన సాహసంతో కూడిన జవాబు విన్నాడు. తన నిర్ణయాన్ని ప్రకటిస్తూ ఈ పిల్లలు విద్రోహానికి సిద్ధపడు తున్నారు. వీళ్ళు మొగల్ అధికారానికి శత్రువులు. వీరిని సజీవ సమాధి చేయాలని ఆజ్ఞాపిస్తున్నాం అన్నాడు.

## మలేర్‌కోట్లా నవాబు వ్యతిరేకత

ఇద్దరు పిల్లలూ నవ్వుతూ నిశ్చింతగా నిలబడి ఉన్నారు.



పిల్లల ధైర్యాన్ని మెచ్చుకుంటున్న నానమ్మ

## నాన్నమ్మ సంతోషం

సాయంత్రంవేళ ఇద్దరు పిల్లలనూ నాన్నమ్మదగ్గరికి పంపారు. పిల్లలిద్దరూ ఉత్సాహంగా దర్బారులో జరిగిన విషయాలన్నీ చెప్పారు. బాలలిద్దరి ధైర్యానికి నాన్నమ్మ సంతోషించింది. ఆమె నోటి నుండి మీరు మీ నాన్న గౌరవాన్ని నిలబెట్టారు అనే మాటలు వెలువడ్డాయి. మరుసటిరోజు పిల్లలను మళ్ళీ దర్బారుకు తీసుకువెళ్ళారు. పిల్లలిద్దరూ మతం మార్చుకుని ఇస్లాం స్వీకరించాలని నవాబు కోరిక. పిల్లలను మరొకసారి అడిగాడు. పిల్లలూ నామాట వినండి. ఇస్లాంను స్వీకరించండి. హాయిగా ఉండండి. ఇస్లాంను స్వీకరించకుంటే మిమ్మల్ని సజీవ సమాధి చేయిస్తాను.

## మేం చావుకి భయపడం

పిల్లలు నిర్భయంగా చావు మా దగ్గరకు రాదు. మాకు చావంటే భయంలేదు. ఏషరతుతో కూడా మేం ఇస్లాం స్వీకరించం. 'మాకు మా ధర్మం ప్రాణాలకంటే ప్రియమైనది' అన్నారు.

## మేస్త్రీలూ మీ పనిచెయ్యండి

మేస్త్రీలు కూడా పిల్లలను ఇస్లాం స్వీకరించి ప్రాణాలను కాపాడుకోండని సలహా ఇచ్చారు. దానికి జవాబుగా మీరు మాచుట్టూ కట్టబోయే గోడ పాపానికీ, అత్యాచారానికీ ప్రతీక. ఆపాపిష్టి గోడను వీలైనంత త్వరగా కట్టండి. మీరు ఎంత త్వరగా ఆ గోడను కడతారో అంతే త్వరగా మొగల్ సామ్రాజ్యం కూడా పతనమౌతుంది అని చెప్పి అన్నదమ్ము లిద్దరూ జపుజీ సాహెబ్ స్తోత్రం వల్లించసాగారు.

## వీరుడా! కళ్ళనీళ్ళెందుకు

గోడ కట్టడం వేగంగా జరుగుతోంది. నగర ప్రజలంతా పిల్లల ధైర్యానికి ఆశ్చర్యపోతున్నారు. మెల్లగా గోడ పిల్లల చెవులదాకా వచ్చింది. జొరావర్‌సింగ్ చివరిసారిగా తన తమ్ముడైన ఫతేసింగ్‌వైపు చూడసాగాడు. జొరావర్‌సింగ్ కళ్ళలోనీళ్ళు తిరిగాయి. ఫతేసింగ్ అన్న కళ్ళలో నీళ్ళు చూసి విచలితుడయ్యాడు. వీరుడా! నీ కళ్ళలో ఆ నీళ్ళేమిటి? బలిదానం చేయడానికి భయపడుతున్నావా? అన్నాడు.

పెద్దవాడైన జొరావర్ సింగ్‌కు ఆ మాటలు బాణాళ్ళా

ఈ సమాధానం విన్న నవాబు వజీర్‌ఖాన్ కోపంతో లేచి నిలబడ్డాడు. మరోవైపు దర్బారులో ఉన్నవాళ్ళంతా వాళ్ళ ధైర్యం గురించి చర్చించుకుంటున్నారు. నవాబు కోపంతో ఈ దయ్యాలను సజీవ సమాధి చేయండి అని ఆజ్ఞాపించాడు.

ఢిల్లీ సామ్రాజ్య మేస్త్రీలైన షిషాల్ బేగ్, విశాల్‌బేగ్ లిద్దరూ ఆసమయంలో దర్బారులోనే ఉన్నారు. పిల్లలిద్దరినీ వాళ్ళ ముందునుంచే నడిపించుకుపోయారు. వీరబాలలిద్దరూ నిర్భయంగా నడుస్తున్నారు. ఈవార్త నగరమంతా వ్యాపించింది. ఈ వీరబాలురను చూడటానికి స్త్రీ, పురుషులంతా వీధుల్లో అటు ఇటు నిలబడ్డారు. గంగూను, నవాబును చాలా మంది తిడుతున్నారు. చిన్నపిల్లల ధైర్యానికి చాలామంది అవాక్కయి చూస్తున్నారు. నిర్ణయించబడిన స్థలానికి పిల్లలను తీసుకువచ్చారు. బాలలిద్దరినీ నిలబెట్టి వారిచుట్టూ గోడకట్టడం ప్రారంభించారు. ప్రజలంతా నలువైపుల నుంచి గుమిగూడసాగారు. ఖాజీ మరొకసారి ఇస్లాం స్వీకరించమని పిల్లల్ని కోరాడు. పిల్లలు మళ్ళీ ధైర్యంగా మేం ఇస్లాంను స్వీకరించేది లేదు. ప్రపంచంలోని ఏ శక్తీ మా ధర్మాన్నుండి మమ్మల్ని దూరం చేయలేదు.

చూసి వాళ్ళ ధైర్యాన్ని కొనియాడుతున్నారు. చివరికి గోడ ఆ మహావీరులైన బాలురను కప్పివేసింది.

## నిర్దయతో హత్య

కొంత సమయం తర్వాత గోడను కూల్చేసారు. బాలురిద్దరూ స్పృహతప్పి పడి ఉన్నారు. ప్రభుత్వ ఆజ్ఞప్రకారం వాళ్ళిద్దరూ హత్యచేయపడ్డారు. ప్రపంచ చరిత్రలో చిన్నపిల్లలను ఈవిధంగా నిర్దయతో హత్యచేసిన సంఘటన మరొకటి లేదు. అదేవిధంగా ఈ వీరబాలురు చూపిన అపూర్వ సాహసం ప్రపంచంలోని మరే దేశచరిత్రలో కూడా కనపడదు. ఆ సమయంలో భారతీయులు తమ ఎదుట అత్యాచారాలు జరుగుతున్నా కూడా వారి పౌరుషం చల్లబడి పోయేదే తప్ప ఆ బాలురి వెచ్చని నెత్తురు కూడా వాళ్ళల్లో వేడిని రగల్చలేకపోయింది. మనోధైర్యానికి ఇంతకు మించిన ఉదాహరణ ఎక్కడ దొరుకుతుంది.

## గుజరీమాత హత్య

గుజరీమాతను కూడా జైలులో వేసారు. అక్కడే ఆమె ప్రాణాలు విడిచింది.

గుచ్చుకున్నాయి. అయినప్పటికీ ముఖంలో నవ్వుతెచ్చిపెట్టుకున్నాడు. ఫతేసింగ్ నువ్వు చాలా నిజాయితీగా చెప్పావు. చావుకు నేను భయపడటంలేదు. అయితే నేనంటే చావే భయపడుతున్నది. ఆ కారణంగానే అది మొదట నీవైపుకు వస్తుంది. నువ్వు నాకంటే వెనుక ఈ ప్రపంచంలోకి వచ్చావు కానీ నాకంటే ముందు బలిదానం చేసేఅవకాశం లభిస్తోంది. అదే నా దుఃఖానికి కారణం అన్నాడు జొరావర్‌సింగ్.

తన అన్న చెప్పిన మాటలువిన్న ఫతేసింగ్ మరింత ధైర్యాన్ని పొందాడు.

## వీరులు గోడలో మునిగిపోయారు.

గోడకట్టడం వేగంగా జరగటంతో ఎత్తు పెరుగుతోంది. మరోవైపు సూర్యాస్థమయం అయ్యే సమయం కూడా దగ్గరపడుతోంది. మేస్త్రీలు కూడా వేగంగా పనిచేస్తున్నారు. పిల్లలిద్దరూ కళ్ళుమూసుకుని తమ ఆరాధ్యదైవాలను స్మరిస్తున్నారు. మెల్లమెల్లగా పిల్లలిద్దరి తలలకంటే పైకి గోడ కట్టబడింది. అక్కడ నిలబడినవారంతా ఆ పిల్లల ధర్మనిష్ఠ

ఆ సమయానికి పెద్దవాడైన జొరావర్‌సింగ్ వయసు ఏడు సంవత్సరాల పదకొండు నెలలు. ఫతేసింగ్ వయస్సు కేవలం అయిదు సంవత్సరాల పదినెలలు.

ఆ సమయానికి గురుగోవింద్ సింగ్ ఒక్కడే మిగిలాడు. అతడి కుటుంబం దేశం కోసం ప్రాణాలర్పించింది. అతడి పెద్దకొడుకులిద్దరూ అతడి కళ్ళముందే చమ్‌కౌర్ యుద్ధంలో వీరగతిని పొందారు. మాఛివాడేలోని ఒక చెట్టుకింద కూర్చొని ఉండగా, అతడి చిన్న కొడుకుల హత్య వార్తను ఒక వ్యక్తి తెలియజేసాడు. గురుగోవిందుడు చలించలేదు. బాణంతో ఒక మొక్కను పెకిలించి ఇక మొగల్ సామ్రాజ్యం కూడా పెకలించబడుతుంది. అన్నాడు.

## బందా బైరాగి

అడవులు కొండలుదాటి గురుగోవింద్‌సింగ్ గోదావరి నది ఒడ్డుకు చేరుకున్నాడు. నది ఒడ్డున మాధవదాసు అనే సన్యాసికి చెందిన కుటీరం ఉంది. ఆ సమయంలో ఆయన ధ్యానం చేస్తున్నాడు. గురుగోవింద్‌సింగ్ అక్కడకు వెళ్లగానే మాధవదాసు ధ్యానం భంగమైంది. ఆయన కోపంతో నువ్వెవరు? లోపలకు రావడానికి ధైర్యమెలా వచ్చింది? అన్నాడు.

## తోడర్‌మల్ ద్వారా అంత్యక్రియలు

అత్యాచారుడైన నవాబున్న నగరంలో తోడర్‌మల్ అనే సత్పురుషుడు కూడా ఉండేవాడు. నిర్దయతో బాలురను హత్యచేయటంతో అతడి మనస్సు గాయపడింది. వాళ్ళ ప్రాణాలు కాపాడలేకపోయినందుకు చాలా బాధపడ్డాడు. దుఃఖంతోనే నవాబు వజీర్‌ఖాన్ దగ్గరకు వెళ్ళి పిల్లల దహన సంస్కారాలు చేయడానికి అనుమతి కోరాడు. నవాబులో మానవత్వమే లోపించింది. దహన సంస్కారాలకు అవసర మయ్యే భూమికి కూడా ధర చెల్లించమని కోరాడు.

తోడర్‌మల్! నీకు ఎంత భూమి కావాలో ఆ భూమిని కప్పగలిగినన్ని బంగారు నాణాలు ఇవ్వండి అన్నాడు. తోడర్ మల్ ధనవంతుడు. ఇంటికెళ్ళి బంగారు నాణాలు తీసు కొచ్చాడు. దహన సంస్కారాలకు అవసరమైన భూమి మేరకు బంగారు నాణాలు చల్లాడు. సగౌరవంగా బాలురిద్దరి దహన సంస్కారాలను పూర్తిచేసాడు. దగ్గరలోనే గుజరీ మాతకు కూడా దహన సంస్కారాలు చేసాడు. మండుతున్న చితిని చూసి తోడర్‌మల్ కన్నీళ్లు కార్చాడు.

గురుగోవిందుడు శాంత స్వరంలో ఇలా అన్నాడు : నేనెవరిని? నేనెవరినో నీకు తెలియదా? నువ్వు స్వయంగా నేనెవరినని అడుగుతున్నావా? మాధవదాసు గురుగోవింద్ సింగ్ కాళ్ళపై పడ్డాడు. 'నేను మీ బందాను' అన్నాడు మాధవ దాసు. గురుగోవిందుడు ఆయన పేరును బందాసింగ్ బహ దూర్ అని మార్చాడు.

గురుగోవిందుడు తన అయిదు బాణాలను, కత్తిని, తన ధ్వజాన్ని అతనికిచ్చాడు. ఆవిధంగా గురుగోవింద్‌సింగ్ ఒక సన్యాసిని వీర సైన్యాధిపతిని చేసాడు. బందాసింగ్ సైన్యాన్ని సమీకరించుకుని గురుపుత్రులను హత్యచేసిన వారిపై ప్రతీకారం తీర్చుకోవడానికి పంజాబువైపుకు బయలుదేరాడు. పంజాబు చేరగానే అనేక సిక్కు సైనికులు ఆయనను కలిసారు. పెద్దసైన్యంతో బందాసింగ్ సర్‌హింద్‌పై దాడిచేసాడు. నవాబు వజీర్ ఖాన్ చనిపోయాడు. సర్‌హింద్ నగరమంతా నాశన మయింది. ఆవిధంగా బందాబైరాగి, గురుగోవింద్‌సింగ్ పిల్లలను హత్యచేసిన హంతకులకు శిక్ష విధించాడు.

జైబోలో సత్ శ్రీ అకాల్